REG. No. N. 45. REG. No. N. 218

గోలకొండ పత్రిక
ట్రూపుబజారు హైదరాబాదు, దక్కన్.
సంవత్సరమునకు చందా రు. ౭-౦-౦
అర్ధసంవత్సరము ,, ,, ౩-౧౨-౦
విడి పత్రిక ౦-౧-౮

STAMP.